# వీరపాండ్య కట్టబ్రహ్మన్న

(స్త్రీ పాత్రలేని నాటిక)

రచన:

గన్నిశెట్టి వెంకటేశ్వరరావు

ఉదయ సాహితీ పబ్లికేషన్సు
మున్సిపల్ ఆఫీస్‌రోడ్ : : విజయవాడ—1.

ఉదయసాహితీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
శోభకృత్ నామ సం॥రం

ప్రచురణ హక్కులు ప్రకాశకులవి

వెల : 1-00

ముద్రణ :
ప్రసాద్ ఆర్టు ప్రింటర్సు
విజయవాడ-2.

సంపాదకులు :
పి. అర్జునస్వామి

# పాత్రలు

వీరపాండ్య కట్టబ్రహ్మన : పాంచాలకురిచ్చి రాజు

| | |
|---|---|
| కుమారస్వామి<br>సుబ్బయ్యనాయకుడు<br>(దొరసింగం) | కట్టబ్రహ్మన సోదరులు |

రఘునాథతొండైమాన్ : పుదుక్కోట పాళెగాడు

ఎట్టప్ప : ఎట్టయాపురపు పాళెగాడు

బానర్‌మేన్ : బ్రిటిష్ సైన్యాధిపతి

ఇంకా కొందరు సేవకులు, సామంతులు వగైరా

కాలము : క్రీ॥ శ॥ 1779 వ సంవత్సరం, అక్టోబరు నెల

స్థలాలు : 1. పుదుక్కోట సంస్థానములో ఒక మహాలు.

2. కయత్తారులోని ఆంగ్లేయుల యుద్ధశిబిరము.

3. డిటో

అంకితం:

అన్నలా నన్నభిమానించే
తమ్ముడు
చి॥ తోట సత్యనారాయణకు
ప్రేమతో ఈ కానుక.

—గన్నిశెట్టి.

---

గమనిక:

ఈ నాటికను నా లిఖిత పూర్వకమైన యనుమతి లేనిదే, ఎవ్వరూ ఏ విధంగాను ఉపయోగించరాదు.

గన్నిశెట్టి వెంకటేశ్వరరావు,
ఐతానగర్, తెనాలి.

# 1వ దృశ్యం

[పుదుక్కోట సంస్థానములో రాజా రఘునాథ తొండైమాన్‌కు చెందిన ఒక మహాలు.]

సమయం : రాత్రివేళ—

తెరలేచేసరికి : పుదుక్కోట అధిపతియయిన రఘునాథ తొండైమాన్ ఒంటరిగా మహాలు మధ్యలో పచార్లుచేస్తున్నాడు. మనిషిలో ఆందోళన స్పష్టంగా కనిపించుతోంది. మధ్య మధ్య ఎవరికోసమో మహాలు వెలుపల వైపుకు, చూస్తున్నాడు. తిరిగి మహాలు మధ్యకువచ్చి పచార్లు చేస్తు న్నాడు.]

[కొంతసేపటికి వెలుపలనుండి మేలిముసుగుతో ఒక వ్యక్తి వచ్చాడు. అతను ఎట్టయాపురపు పాళెగాడైన ఎట్టప్ప నాయకుడు. నిలువెల్లా విషం తొణికిస లాడుతోంది. వాకి[?] దగ్గరే ఆగి సన్నగా సకిలించాడు.]

[తొండైమాన్ తృప్తిపడిచూచాడు. ఎట్టప్ప మంద హాసం చేస్తూ, మేలిముసుగు తీశాడు.]

ఎట్టప్ప : రాజా విజయ రఘునాథులకు జయమగుగాక!
(నమస్కరించాడు.)

రఘునాథ : (తడబడుతూనే) ఎట్టయాపుర సార్వభౌములకు సుస్వాగతం. దయచేయండి. (ఆసనం చూపించాడు.)

ఎట్ట : తమరు—(కూర్చోమన్నట్టు అభినయించాడు.)
[ఇద్దరూ కూర్చున్నారు. ఒక సేవకుడు వాకిలిదగ్గర నిలబడి బయటకు చూస్తున్నాడు.]

ఎట్ట : తమరు చేస్తున్న ఈ సహాయానికి మేజర్ బానర్ మేన్ ఎంతో సంతసించారు. తమ తరఫున, తమ ఈస్టిండియా కంపెనీ తరఫున మీకు కృతజ్ఞతలు తెలుపవలసిందిగా చెప్పారు.

రఘు : (జీవంలేని స్వరంతో) మంచిది.

ఎట్ట : (నిలబడి) ఆఁ. కట్టబ్రహ్మన, ఆయన పరివారం యెక్కడ?

రఘు : ఈ మహాలులోనే వున్నారు.

ఎట్ట : (అదిరిపడి) ఆఁ! ఈ మహాలులోనా!

రఘు : అవును.

ఎట్ట : మరి . . . మన మిక్కడ . . .

రఘు : పర్వాలేదు వారు ఇంకో ఘడియవరకు ఇటురారు. కోవెలకు వెళ్ళారు. కాని—ఎట్టప్పగారు ... (లేచాడు.)

ఎట్ట : ఏమిటి ?

రఘు : మనము చేస్తున్నది సబబయిన పనేనా అని నా అనుమానం

ఎట్ట : ఆఁ! ఏ మన్నారు ?

రఘు : (బాధగా) అవును మిత్రమా ! దక్షిణ దేశానికి గుండెకాయగా, మనందరకండగా నిలచివున్న వీరుడు, అనేక ఆపదలకాచుకొన్న మిత్రుడు, నిత్యసత్య వ్రతుడైన కట్ట బ్రహ్మనపట్ల మన మనుసరించవలసిన పద్ధతి ఇదేనా ?

ఎట్ట : (ఆందోళనగా) రఘునాధ రాజా !

రఘు : నిజమాలోచిస్తే, ఇది ఎంత ద్రోహ మెట్టప్పగారూ ! ఇంతకన్నా ఆత్మవంచన . . .

ఎట్ట : ఇంతకూ మీ అభిప్రాయము ?

రఘు : మనం అనాలోచితంగా ప్రవర్తిస్తూన్నామేమో ఒక్కసారి ఆలోచించండి ఎట్టప్పా !

ఎట్ట : నా ఆలోచనలు, నిర్ణయాలు, నిశ్చయాలు ఎప్పుడో జరిగిపోయినవి మీపద్ధతి అర్ధంకాకనే ఆలోచిస్తున్నా నిప్పుడు.

రఘు : ఎట్టప్ప నాయకా !

ఎట్ట : అవును. మమ్మల్ని నమ్మించి పిలిపించి ఇప్పుడిలా మాట్లాడడం చూస్తే — క్షమించాలి — మిమ్మల్ని అనుమానించాల్సిన అవసరం కనిపిస్తోంది.

రఘు : ఎట్టప్ప నాయకా !

ఎట్ట : మరేమిటిదంతా ?

రఘు : అది కాదు ఎట్టప్పా! *కరుత్తయ్యా నాయకుడు నాకు ఎంతో మేలు చేసివున్నాడు. అటువంటివానికి ద్రోహం చేయటానికి అంతరాత్మ...

ఎట్ట : అదంతా ముందెందుకు ఆలోచించలేదు తమరు ? (దగ్గరగావచ్చి) చూడండి. ఏ స్నేహాలయినా, అభిమానాలయినా మన బాగోగుల తర్వాతనే కదా ? ఈనాడు దేశమంతా వరుసగా ఆంగ్లేయుల హస్తగతమైపోతోంది. ఎందరో మహారాజులు ఆసేతుహిమాచల పర్యంతం తెల్లవారికి జోహుకుం అంటున్నారు, వారి ధాటికి నిలువలేక. ఈ కుంపినీ ముంపుకు ఎదురు నిలవటానికి మనమెంత ? మనతాహతెంత చెప్పండి ? వారితో మంచిగావుండి మన రాజ్యాలు, సిరిసంపదలు కాపాడుకోవటంకన్నా ఉత్తమమైన మార్గంలేదు. నామాట వినండి. ఈ మహాప్రవాహానికెదురు నిలిచామా, పాంచాలకుర్చికి పట్టినగతే మనదేశాలకూ పడుతుంది. కరుత్తయ్యా నాయకునివలెనే మనమూ మాడిపోతాము. నా మాట విని ఈ మమకారాలు, ధర్మాధర్మాలు వదిలి కంపెనీవారితో చేతులు కలపండి. కట్టబ్రహ్మ సోదరులను పట్టియిచ్చి వారిమెప్పు సంపా

(* కట్టబ్రహ్మన నామాంతరము )

దించండి. పుదుక్కోట, ఎట్టయాపుర సంస్థానాల అభి
వృద్ధిని సాధించండి మన స్నేహం చిరస్థాయిగా
నిలపండి. ఈరోజుగాకున్నా రేపయినా కట్టబ్రహ్మన
ఖైదీగాక తప్పదు. మీకు అందివచ్చిన అవకాశాన్ని
సద్వినియోగం చేసుకోండి. ఇంతకన్నా, నేను చెప్పా
ల్సింది లేదు. ఇక మీ ఇష్టం.

రఘు : (తీవ్రంగా ఆలోచిస్తూ నిలబడ్డాడు.)

ఎట్ట : (సన్నగా నవ్వుతూ) రాలిపోతున్న ఎండుటాకులకోసం
చింతించి లాభమేమిటి మహారాజా! ఓడలు బళ్ళు,
బళ్ళు ఓడలు. ఇది సృష్టిలో ఎప్పుడూ వున్నదే! ఓడ
నెక్కితేనే ఒడ్డు చేరగలం.

[బయటనుండి ఎవరో వస్తున్న చప్పుడు. ఇద్దరూ
ఆతృతగా చూచారు. వాకిలి దగ్గరనున్న సేవకుడు
వచ్చి రఘునాధ్ తొండైమాన్‌కు నమస్కరించాడు.]

సేవ : పాంచాలకురిచ్చి ప్రభువులొస్తున్నారు ప్రభూ!

రఘు : సరే. నువ్వు నీ స్థానంలో నేనిలబడు. ఎట్టప్ప నాయకా!
(లోనికి రమ్మని సైగచేసి తను ముందు నడుస్తున్నాడు
ఎట్టప్ప అతని ననుసరించాడు. ఇద్దరూ కలిసి కుడిప్రక్క
ద్వారమునుండి వెళ్ళిపోయారు.]

[కొన్ని క్షణాల తర్వాత వీరపాండ్య కట్టబ్రహ్మన
కుమారస్వామి, సుబ్బయ్యా నాయకుడు బయటనుండి
వచ్చారు.]

[వాకిలి వద్దనున్న సేవకుడు వారికి వంగి నమస్కరించాడు. ముగ్గురూ సరాసరివచ్చి ఆసనాలపై కూర్చుంటారు.]

కుమా : మనమున్న దుస్థితిలో మనకింకా నిజమైన మిత్రులు మిగిలి వుండటం మన యదృష్టమేననుకోవచ్చు.

సుబ్బ : కాకున్న, దక్షిణాపథమంతా కంపెనీవారికి గులాములై వారి అడుగులకు మడుగులొత్తుచున్న పాలెగాండ్లతో నిండిపోయిన ఈ స్థితిలో పుదుక్కోట అధిపతులు మనల నింతగా ఆదరించటం సామాన్యమైన విషయమా ?

కట్ట : (గంభీరంగా) అందరూ యెట్టప్పనాయకులే వుండరుగా సోదరా ! భారతజాతి అంతా స్వార్థపరులు, ఆత్మాభిమాన శూన్యులు, దేశద్రోహులు, మిత్రద్రోహులు అని యెందుకనుకోవాలి ? మానవుల్లోనే దేవతలూ వుంటారు; రాక్షసులూ వుంటారు.

కుమా : మనవీరులతోపాటు మన గడ్డమీదనే విజయమో వీరస్వర్గమో తేల్చుకుంటేనే బాగుండేదేమో ! ఇలా అజ్ఞాతంగా అవస్థలు పడటం...

కట్ట : నీ వన్నది నిజమే కుమారస్వామీ ! ఇది మనలాంటి వీరుల కనుచిత మయిన మార్గమేననిపిస్తుంది. కాని ఆ క్షణాన ఇదే అవసరమనిపించింది.

సుబ్బ : అవునన్నా ! బ్రతికివుంటే ప్రతీకారానికి అవకాశ మెుంటుంది గదా ?

[కట్ట బ్రహ్మన లేచి నిలబడ్డాడు. తమ్ములిద్దరూ ఆతని ననుసరించారు.]

కట్ట : మనకు వీరస్వర్గం కోరుకుంటే, పరజాతి హస్తగతమయి పోతున్న మాతృభూమికి విముక్తి లభించేదెలా? మతృభూమిని రక్షించుకోటంకోసం మనలాంటివారు కొందరైనా బ్రతికివుండటం అవసరం. (కొంచెమాగి) మనందర్నీ సురక్షితంగా బయటకుపంపి అమాత్య శేఖరులు ఆ రక్కసి మూకలకు బలయ్యారు. అదే నా విచారం.

కుమా: తండ్రిలాంటి దానాపతి మనకు లేకుండాపోయారు.

కట్ట : పరమ భక్తాగ్రేసరుడైన ఆ మహానుభావుని శిరస్సును పాంచాల కురిచ్చిలో ఊరేగించిన ఆ పరమ నీచుడు, నరహంతకుడు బానర్ మేన్‌పై ప్రతీకారం తీర్చుకొనే వరకూ నాకు మనశ్శాంతి లభించదు.

సుబ్బ: దీనికంతకూ మూలకారకుడైన దేశద్రోహి ఎట్టప్పకు తగిన శిక్షలభించాలి.

కుమా: అవును. అదే ముఖ్యం.

కట్ట : ఆ పరమేశ్వరుని అనుగ్రహం, ఆ తల్లి జక్కమ్మ కృప మనపైవుంటే యెన్ని కష్టాలనుభవించినా అంతిమ విజయం మనకు లభించి తీరుతుంది. (శూన్యంలోనికి

చేతులు జోడించాడు.) పరాన్నభుక్కులకూ, పాపులకూ, ద్రోహులకూ ప్రతీకారం జరిగి తీరుతుంది.

[కుడిప్రక్క ద్వారంనుండి ఒక సేవకుడు వచ్చాడు]

సేవ : (వంగి నమస్కరిస్తూ) పాంచాలకురిచ్చి ప్రభువులకు జయము. మా ప్రభువులు పుదుక్కోట అధిపతులు విజయం చేస్తున్నారు.

కట్ట : మంచిది.

[రఘునాథ తొండైమాన్ వచ్చాడు.]

రఘు : పాంచాల కురిచ్చి అధిపతులు మా అతిథులు. శ్రీ కట్ట బొమ్మ కరుత్తయ్య నాయకులకు అభివాదములు.

కట్ట : మా ప్రాణమిత్రులు, పుదుక్కోట ప్రభువులు శ్రీ రఘునాథతొండైమాన్‌కు కృతజ్ఞతాభి వందనములు.

[ఒకరినొకరు కౌగిలించుకున్నారు.]

రఘు : కొన్ని అత్యవసర కార్యములవల్ల తమర్ని కలుసుకోవటం ఆలస్యమైంది. మన్నించాలి.

కట్ట : ఎంతమాట ! తమ ఆదరాభిమానములకు మా హృదయాలు కృతజ్ఞతతో నిండిపోతున్నవి. ఈ క్లిష్టపరిస్థితులలో మీ లాంటి సహృదయులయిన మిత్రులు మిగిలి వుండటం మా అదృష్టంగా భావిస్తున్నాము.

రఘు : జన్మభూమి స్వాతంత్ర్యాన్ని నిలబెట్టటంకోసం మీరు ఇన్ని బాధలకు గురివుతున్న సమయంలో; మీ కష్ట

లలో పాలుపంచుకొని మీ కృషికి చేయూత నివ్వటం మా విధ్యుక్త ధర్మం కాదా?

కట్ట : (గాద్గదికంగా) రఘునాథ రాజా ! మీలానే అందరు పాలెగాండ్లూ భావించితే, మన మాతృభూమికీ దుర్గతి పట్టివుండదు గదా !

రఘు : మాతృభూమిపై అభిమానములేని వారుంటారా మిత్రమా ! కాని, పరిస్థితుల ప్రభావానికిలోనై కొందరు, కంపెనీవారి బలానికి వెరచి కొందరు, మిన్న కున్నారే కాని, ప్రతి పాలెగాని హృదయం స్వతంత్రం కోసం ఆరాటపడుతూనేవుంది.

కుమా: అలా ఆరాటపడటం నిజమైతే, ఐక్యత్వతో అందరూ నిలబడి కంపెనీవారిని మన గడ్డమీదనుండి వెళ్ళగొట్ట వచ్చుగదా ప్రభూ ?

రఘు : నిజమే ! కాని, దానికీ సమయం రావాలి కుమార స్వామిగారూ !

సుబ్బ: ఎట్టప్ప నాయకునిలాంటి భ్రాతృద్రోహులు, దేశ ద్రోహులు, వున్నంతకాలం ఐక్యత నాశించగలమా రఘునాథ రాజా !

రఘు : (కొంచెం కలవరపడ్డాడు. సద్దుకుని) ఒకరి సంగతి అనవ సరం నా విషయం తీసుకోండి. మీ ఉద్యమంలో మీకు అండదండగా నిలచి, మీకు కావలసిన సహాయ అన్ని విధాల అందించటానికి నేను సంసిద్ధుడనై

వున్నాను. నా సంపద, సైన్యం అన్నీ దేశంకోసం విని యోగించుకొనే అధికారం మీకు ఇస్తూ, మీ అడుగు జాడల్లో నడవటానికి అంగీకరిస్తూ, మీకు వాగ్దాన మిస్తున్నాను.

[కట్టబ్రహ్మన చేతిలో చెయ్యివేశాడు]

కట్ట : (ఆనందబాష్పాలు రాలుస్తూ) మిత్రమా! ఈనాడు నా జన్మ ధన్యత చెందింది. ఇక నా ఉద్యమం నిరాటంకంగా సాగిపోతుంది.

[సంతోషంతో కౌగలించుకున్నాడు.]

రఘు : ఆఁ, మీరు బాగా అలసినట్లు కనిపిస్తున్నారు. ఉదయం కర్తవ్యం గురించి ఆలోచిద్దాం మీరు విశ్రాంతి తీసుకోండి (వాకిలివేపు చూస్తూ) ఎవరక్కడ ?

సేవ : (వచ్చి నమస్కరించి) చిత్తం.

రఘు : ప్రభువులను విశ్రాంతి మందిరంలోనికి తీసుకవెళ్ళు. మరి నాకు శెలవు.

కట్ట : సంతోషం.

[రఘునాధరాజు వాకిలివరకూ వెళ్ళి సేవకునికి నెమ్మదిగా ఏదో చెప్పి నిష్క్రమించాడు.

ఇద్దరు సేవకులు ప్రవేశించారు. కట్టబ్రహ్మ సోదరులు, తమ ఆయుధాలు, తలపాగలు వద్దరాలన్నీ తీసి వారికందించారు. సేవకులు వాటిని తీసుకవెళ్ళి ఎడమ ప్రక్కనవున్న గదిలో భద్రపరిచి వచ్చారు.

సేవకులు దారిచూపుతుండగా వారు ముగ్గురూ, కుడివేపు వాకిలినుండి లోనికి వెళ్ళబోయారు. హఠాత్తుగా బల్లేలు, సుపాకులు వాకిలిదగ్గర ప్రత్యక్షమైనవి. వాటిని గురిపెట్టిన సిపాయిలు కనిపించటంలేదు. వారు లోపలే వున్నారు ]

(ముగ్గురూ క్షణకాలం స్థంభించిపోయారు.)

[ ప్రక్కనున్న సేవకులు తప్పుకున్నారు. కుమారస్వామి మోసం" అని అరిచాడు గట్టిగా.

పెద్ద నవ్వు జవాబుగా వినిపించింది.

ముగ్గురూ మరో వాకిలివేపు తిరిగారు. అక్కడా అంతే. వెనుకనుండి ఎట్టప్పనాయకుడు తెల్ల సిపాయిలతో ప్రవేశించి వికృతంగా నవ్వుతున్నాడు.

"ఎట్టప్పా!" అంటూ తమ్ములిద్దరూ ముందుకు దూకారు. కట్టబ్రహ్మన వారిని పట్టుకుని ఆపాడు

సైనికులుమరింత దగ్గరగావచ్చి చుట్టూ క్రమ్మారు కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడచిపోయినవి]

కట్ట : (స్థబ్దుసిగా నిలచివున్న యెట్టప్పను చూచి) ఏం ఎట్టప్ప నాయకా! ప్రతిమలా నిలబడిపోయావేం? సింహాలు బోనులో చిక్కినవన్న సంతోషం కనిపించదేం నీ మోముగో ?

ఎట్ట : వంటఇంటి కుందేలెక్కడికి పోలేవుగా ?

కుమా: } ఆఁయ్ ! (గర్జిస్తూ ముందుకు దూకారు. సైనికులు
సుబ్బ: } తుపాకులు గురిపెట్టారు. కట్టబ్రహ్మన తమ్ముల్లను
వారించాడు.

కట్ట : నిజమే యెట్టప్పా. తప్పించుకపోవటం మా అభిమతం కాదు నీవు నిర్భయంగా మమ్ముల్లను బందీలను చేసి, నీ ప్రభువులయిన తెల్లదొరల సన్నిధికి తీసుక పోవచ్చును. కాని యెట్టప్పా; పాంచాలకురిచ్చి సింహాలను బంధించటం నీ వల్లకాదు; నీ తెల్లదొరలవల్లా కాదు. మిత్రద్రోహుల నయవంచన ఫలితమే ఈ దుష్ఫలితమని తెలుసుకో. లేకుంటే, నీవు వెయ్యేండ్లు తల్లక్రిందులుగా తపస్సుచేసినా ఈ అవకాశం నీకు లభించేదికాదు. కానివ్వు, నీ పని పూర్తి చేసుకో. నీ చిరకాల వాంఛితమీడేర్చుకో. ఊఁ. సందేహించకు. (చేతులు ముందుకు చాపాడు.)

ఎట్ట : (సిపాయిలనుచూచి) ఊఁ కానివ్వండి.

[సిపాయిలు బేడీలు తగిలించబోతున్నారు]

కుమా: అన్నా ! (బిగ్గరగా అరిచాడు) యెట్టప్పా ; యెంత ధైర్యంగా నీకు ! పాంచాలకురిచ్చి ప్రభువుకే బేడీలు వేయ సాహసిస్తున్నావుగా ?

ఎట్ట : (బిగ్గరగానవ్వి) పాంచాలకురిచ్చి — ప్రభువులు - అంత గతంలో సంగతి కుమారస్వామీ !

కుమా: ఆఁ! యెంత కండకావరం ! (ముందుకు లంఘించాడు. కట్ట బ్రహ్మన్న ఆపాడు.)

కట్ట : ప్రతిఘటన వద్దు తమ్ముడూ; లొంగిపొండి. విషాదాంతమయిన ఈ కథలో దుర్మార్గులదే పై చేయి అయింది.

ఎట్ట : (సిపాయిలతో) ముగ్గురినీ బంధించండి.

(సిపాయిలు ముగ్గురకూ సంకెళ్లు వేశారు)

కట్ట : (గంభీరంగా) ఒక రెండు క్షణాలు ఆగు ఎట్టప్పా. నా ఆప్తమిత్రుడైన శ్రీ శ్రీ శ్రీ విజయరఘునాథ తొండైమాన్ ప్రభువును ఒక్కసారి పలకరించి వెళ్దాం. (పుదుకోట సేవకుని చూచి)

నాయనా.! మా ప్రాణమిత్రులు పుదుకోట ప్రభువు లెక్కడ ? వారిని కడసారి సందర్శించి రెండు మాటలు మాట్లాడి వెళ్ళాలి.

సేవ : ప్రభువులకు సుస్తీగా వుంది. వారిప్పుడు కనుపించరు.

కట్ట : (విచారాన్నభినయించి) అయ్యో ! పాపమలాగా ! ఇంత అకస్మాత్తుగా వారస్వస్థులయ్యారా ! చాలా విచారకరము.

సుబ్బ : అవును. ఇంత నయవంచనచేసి మన ఎదుటకు రావటానికి మొహం చెల్లవద్దా పాపం.

కుమా: ఆ ద్రోహి తగిన ఫలితాన్ని త్వరలోనే అనుభవించ గలడని చెప్పు.

కట్ట : మనల నాదరించి ఆశ్రయమిచ్చిన ఆ మహానుభావుని అంతమాటన కూడదు తమ్ముడూ! (సేవకుని దగ్గరగా వెళ్ళి) అయ్యా! ఆ మహోదారుని ఔదార్యం మరువలేమని చెప్పు వారికి నా కడసారి నమస్కారాలు అందచెయ్యి. కృతజ్ఞతతో మా మేనులు పులకరించి, కళ్ళ వెంట ఆనంద బాష్పాలు వరదలై ప్రవహించినవని చెప్పు మీ ప్రభువునకు. ఈ మహోపకారాన్ని మేం మరచిపోయినా, భవిష్యత్తులో చరిత్రకారులు మరువరనీ, వారి నామధేయం చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడుతుందనీ, వారి కీర్తి ఆచంద్రతారార్కం విస్తరిల్లుతుందని తెల్పు వారికి సర్వశుభములు చేకూర్చవలసిందిగా భగవంతుని వేడుకుంటూ మేము శలవు తీసుకున్నామని చెప్పు.

[సేవకుని భుజం తట్టాడు. సేవకుడు బాధగా కళ్లు తుడుచుకుని, కట్టబ్రహ్మనకు నమస్కరించాడు. కట్టబ్రహ్మన చిరునవ్వు నవ్వాడు ]

కట్ట : ఎట్టప్పా! (భుజం తట్టి) మంచో చెడో దాచుకోకుండా బహిరంగంగా నువ్వు చెయ్యదలచినది చేస్తావు నమ్మించి నయవంచనతో గొంతులు కూల్చే మహానుభావులకన్నా నువ్వు వెయ్యిరెట్లు మెరుగు. నీకు తెల్ల

నేరల ప్రాపకం కావాలి. వారి బహుమానాలు కావాలి అందుకోసం నీ మాతృభూమికీ, నీ సోదరులకూ ద్రోహం చెయ్యటానికి నువ్వు సందేహించవు. కాని, మాతృభూమి మీద ప్రేమను ఒలకబోస్తూ, స్నేహం నటించి నమ్మినవారి గొంతుల కురిత్రాడు తగిలించే పెద్దలు నీ కన్నా ఎంతో హీనులు! నీ కన్నా వారే దోషులు ! వారితోపాటు పోల్చుకుంటే నువ్వు చాలా ఉత్తముడివి. (భుజం తట్టి నవ్వాడు )

ఎట్ట : (తలవంచాడు )

కట్ట : నా మిత్రుడు రఘునాధ్ తొండైమాన్ ప్రవర్తన నీకూ నీచంగా కనిపించుతోందా ఎట్టప్పా ! తల వంచుతున్నావ్ ?

ఎట్ట : (సర్దుకుని) మాటలతో కాలయాపన చేయటానికి మాకు తీరిక లేదు. నడవండి.

కట్ట : అలాగే ఎట్టప్పా ! పద వెళ్దాం.

[సిపాయిలు చుట్టూవుండి వార్ని నడిపించుకొని వెళుతున్నారు.]

[కట్టబ్రహ్మ సోదరులు గజాల్లా వారిమధ్య నడుస్తున్నారు.]

(అందరూ వెళ్ళగానే రఘునాథ్‌రాజు వచ్చాడు. ఒక్క క్షణకాలంవారు వెళ్ళిన వేపేచూచి, సింహాసనంమీద కూలపడి, తలరెండు చేతులతో పట్టుకున్నాడు.)

రఘు : నా పాపానికి పరిహారమేమిటి సర్వేశ్వరా !

(అస్పష్టంగా అన్నాడు; తెరజారింది.)

# 2వ దృశ్యం

[కయత్తారులోని ఆంగ్లేయుల యుద్ధ శిబిరము. అంతా పాశ్చాత్య పద్ధతిలో అలంకరించబడి వుంది. ఈస్టిండియా కంపెనీవారి సైన్యాధిపతి మేజర్ బానర్ మేన్ సిగార్ కాలుస్తూ, చేతులు వెనక్కి కట్టుకుని పచార్లు చేస్తున్నాడు; శిబిరం మధ్యన. శిబిరానికి ఎడమ ప్రక్కన బయటకు వాకిలి వుంది. కుడిభాగంలో ప్రక్క. అరలోనికి మార్గముంది బయట సిపాయిలు కాపలా కాస్తున్నారు.]

[కొన్నిక్షణాల తర్వాత బయటనుండి ఒక సిపాయి వచ్చి ఇంగ్లీషు పద్ధతిలో శాల్యూట్ చేసి అటెన్షన్‌లో నిలబడ్డాడు ]

బానర్‌మాన్ : వాట్ ? వాటీజ్ ది మేటర్ ?

సిపాయి : ఎట్టప్ప నాయకులుగారు విచ్చేస్తున్నారు సార్ !

బాన : విత్ యమ్‌ప్టీ హేండ్స్ ? వట్టి చేతులతో.

సిపా : లేదుసార్. పాంచాలకురిచ్చి సింహాన్ను బంధించి తీసుకొస్తున్నారు సార్ !

బాన : వాట్ ! ఈజిట్ ట్రూ ? సత్యమా ?

సిపా : నిజం సార్.

[బానర్‌మేన్ ఎగిరి గంతేశాడు. చుట్టపారేసి, స్టూలు మీాదనున్న మద్యం గ్లాసులోకి వంపుకు తాగాడు.]

బాన : వెరీగ్లాడ్ ! వెరీగ్లాడ్ ! గొప్ప ఆనందము. ఈరోజు గొప్ప ఫెస్టివల్‌డే ! (సంచిలోనుండి కొన్ని నాణెములు తీసి సిపాయికి విసిరివేశాడు. వాడు అందుకుని నమస్కరించాడు) వెరీవెరీ గుడ్‌న్యూస్ ! చాలా గొప్ప మంచి వార్త తెచ్చినావు. నీవు వెళ్ళి త్వరగా మా ఫ్రెండ్ ఎట్టాయప్పగార్ని పంపించు. (సిపాయి వెళ్ళబోతాడు.) వద్దు. నో, మేమే స్వయంగా వారి నాహ్వానించెదము. పద మైఫ్రెండ్స్ . . . నా కలలు నిజమైన వీ దినము. పద నడువు. (హేట్ తగిలించుకొని బయలుదేరాడు. ఇద్దరూ నాలుగడుగులు వేసేసరికి. బయుట కలకలము వినిపించింది. ఆగిపోయారు. బయటనుండి "రాజధిరాజ ఎట్టయా పురాధీశ శ్రీ ఎట్టప్పనాయకులకు జై" అని కేకలు)

సిపా : (బయటకు చూచి) ఎట్టప్పనాయకులుంగారు దయ చేస్తున్నారు సార్ !

బాన : (పొంగిపోతూ) సంతోషము. చాలా సంతోషము (బాటిల్‌లోని మద్యం వంపుకుని త్రాగాడు. ఎట్టప్ప ప్రవేశించాడు.)

ఎట్ట : (వస్తూనే) మేజర్ బానర్‌మెన్ ప్రభువులకు నమస్కారములు.

బాన : (ఆనందంతో షేక్‌హేండిచ్చి కౌగలించుకుంటూ—) స్వాగతము మైడియర్ ఫ్రెండ్! అయామ్ వెరీగ్లాడ్ టూమీట్‌యూ. ఈరోజు మీ రాక మాకు గొప్ప ఆనందమును కలిగించినది. కమాన్ కమాన్ (చెయ్యి పట్టుకుని నడిపించుకొని వెళ్ళి కుర్చుండబెట్టాడు. తను ఎదురుగావున్న మరో కుర్చీమీద కూర్చొని చుట్ట ముట్టించాడు.)

బాన : సాధించినారు ఎలా నయితేనేం!

ఎట్ట : ఎట్టప్ప ఆడితప్పటం ఏనాడైనా చూశారా తమరు?

బాన : హెంతమాట! మీరు వెళ్ళినప్పుడే తలిచితిని, వట్టి చేతులతో రారు అని. బాగా కష్టపడినారు.

ఎట్ట : అనుకున్నంతగా కష్టపడనవసరం కనిపించలేదు. చాలా సులభముగా కార్యము నెరవేరింది ప్రభూ!

బాన : వాట్! నిజమా?

ఎట్ట : అవును ప్రభూ! మన మిత్రుడు పుదుక్కోట అధిపతి మేము వెళ్ళేసరికే అన్నీ కట్టుదిట్టంగా చేసి వుంచాడు. మేము వెళ్ళిన వెంటనే బంధించి తీసుకరావటానికి వీలుగా ఆయనే అన్ని ఏర్పాట్లు చేశాడు.

బాన : ఓహ్హో! వెరీగుడ్! చాలా మంచి మనిషి ఆయన! చాలా గొప్ప మనిషి! వేరీజ్ హీ? వారెక్కడ?

ఎట్ట : ఆయన కొన్ని అత్యవసరమయిన పనులవలన అక్కడే వుండిపోయారు. తరువాత వచ్చి తమదర్శనం చేసుకొంటామని మనవి చేయమన్నారు.

జాన : వెరీగుడ్ ! వెరీగుడ్ ! మీరు రేపు ఉదయమే వారికి మన ఘనతకు, వారి ఘనతకు తగిన ప్రెజెంటేషన్స్ అంటే బహుమతులు వెంటనే పంపించండి వారికి కంపెనీవారి సహాయం ఎప్పుడూ అంద చేస్తాము, అని జాబు వ్రాసి పంపండి.

ఎట్ట : చిత్తం. అలాగే!

జాన : వారికి మా థేంక్సు అని వ్రాయండి.

ఎట్ట : చిత్తం.

జాన : మన దుబాసిగారిని పిలిపించి, మన ఫ్రెండ్స్ అందరకూ ఈ శుభవార్త అందేలా జాబులు వ్రాయమనండి. ఈనెల పదునారు తేదీనాడు, కట్టాబొమ్మన్ కేసు విచారణ జరుగును. కాబట్టి జమీందార్స్ అందరూ తప్పక రావలసిందిగా ప్రకటన చేయించండి.

ఎట్ట : అలాగే, అన్నీ మేము స్వయంగా చూస్తాము. మీరు ఇక హాయిగా నిశ్చింతగా వుండండి.

జాన : వెరీగుడ్ వెరీగుడ్ ! మీ మేలు, కంపెనీవారు ఎన్నటికీ మరచిపోయేది లేదు. మీకు వెంటనే గొప్ప బహుమతులు లభించగలవు.

ఎట్ట : తమ ఆదరాభిమానాలు ముఖ్యంగాని, బహుమతుల దేముంది ప్రభూ !

బాన : అవును. రియల్ ఫ్రెండ్ మీరు మాత్రం. మీకు గొప్ప గొప్ప—సన్మానము చేస్తాము (భుజం తట్టాడు)

ఎట్ట : (ఆనందంతో కళ్ళు మెరిసినయ్.)

బాన : మీరు చాలా అలసిపోయినారు రండి. ఈ సంతోష సమయంలో కొంచెం వైన్ తీసుకుందాము. ఆతర్వాత పాంచాలకురిచ్చి లీడర్లను చూద్దాము.

ఎట్ట : అలాగే.

[బానర్ మేన్ మద్యం గ్లాసుల్లోనికి పంపి, ఒక గ్లాసు ఎట్టప్పనాయకునకు అందించి మరొక గ్లాసు తను తీసుకున్నాడు. ఇద్దరూ గ్లాసులు తాకించుకొంటూ నవ్వుకుంటున్నారు; బిగ్గరగా. తెర జారుతుంది.]

# 3 వ దృశ్యం

[ వెనుకటి ప్రదేశమే. కాని రెండు ప్రక్కలా కుర్చీలతో తీర్చి దిద్దివుంది. వెనుకగా, న్యాయాధిపతి కూర్చునే సింహాసనం, డ్రాయరు వున్నవి. కుర్చీలలో పాలెగాళ్ళు, సామంత రాజులు కూర్చుని వున్నారు. న్యాయమూర్తి సింహాసనాని కిరుప్రక్కగా తెల్ల సిపాయిలు తుపాకులు ధరించి నిలబడి వున్నారు. కొంత సేపటికి మేజర్ బానర్ మన్ కుడిప్రక్క నుండి వచ్చి సింహాసనమధిష్టించాడు ఆయన రాగానే సామంతులంతా గౌరవ సూచకంగా లేచి నిల బడ్డారు. సిపాయిలు శాల్యూట్ చేశారు. బానర్ మేన్ కూర్చున్న తర్వాత, రాజులంతా కూర్చున్నారు. బానర్ మేన్ రెండు క్షణాలు అందర్నీ తేరిపార చూశాడు. గొంతు సవరించు కుని మొదలెట్టాడు.]

బాన : ఫ్రెండ్స్ అండ్ జెంటిల్ మన్ ! మిత్రులారా ! గౌరవనీయులైన పెద్దలారా ! మీ అందరినీ కలుసుకో

గ్గలిగినందులకు మాకు చాలా హేపీగా సంతోషముగా వున్నది. మీ అందరకూ మా కంపెనీ తరఫున స్వాగతం చెబుతూ వున్నాము. మీ అందరకూ శుభమగుగాక. తరువాత—ఇప్పుడు మీ అందరనూ పిలిపించినది ఒక ఇంపార్టెంట్ అంటే అతి ముఖ్యమైన పనివుండి పిలిపించినాము. అది ఏమంటే - పాంచాలా కురుచ్చి పాళెగాడైన కట్టాబొమ్మన్ కరుత్తయ్య నాయకుడు – బహుకాలముగా, కంపెనీకి కప్పము చెల్లించినది లేకపోగా, ఆయన దేశములో అశాంతిని బోధచేయుచూ, కంపెనీ అధికారమును ఎదిరించి, కంపెనీకి అనేకమయిన కష్టములు నష్టములు కలిగేలా ప్రవర్తించినాడు. ఈనాడు ఆయన కంపెనీవారికి బందీగా చిక్కివున్నారు. వారి నేరములను విచారించి తగిన పనిష్మెంట్ అనగా శిక్షను విధించుటకు కంపెనీ నిశ్చయించినది. ఈరోజుననే విచారణ జరుగును. కాన పెద్ద మనుషులుగా మీ అందరనూ పిలిపించి యున్నాము. మా ఆంగ్ల సాంప్రదాయము చాలా ఉన్నతమైనది. ఎంత పెద్ద నేరస్థులనైనా సక్రమమయిన విచారణ జరుపనిదే శిక్షించము మేము.

[ఎట్టప్ప చప్పట్లు కొట్టాడు. సామంతులలో ఇష్టముండి కొందరూ, లేక తప్పనిసరై కొందరూ అతడ్ని అనుసరించారు. బానర్ మేన్ చిరునవ్వుతో తలపంకించాడు.]

ాన : సంతోషము. చాలా చాలా సంతోషము. మీరందరూ అనుమతిని యిచ్చిన వెంటనే విచారణ ప్రారంభము అవుతుంది.

ఎట్ట : మా అందరకూ సమ్మతమే. తమరు దోషిని పిలిపించి విచారణ ప్రారంభించవచ్చును. ఏమంటారు మిత్రులారా !

[సాటివారి నడిగాడు. ప్రతినుల్లా తలలూపారు.]

బాన : వెరీగుడ్. (టేబుల్ పైన చప్పుడుచేస్తూ) ఎవరక్కడ ? (ఒక సిపాయి ప్రవేశించి శాల్యూట్ చేశాడు.) ఖైదీగావున్న కట్టాబొమ్మన్‌ను తీసుకరండి (సిపాయి శాల్యూట్ చేసి వెళ్ళిపోయాడు. సామంతులలో గుసగుసలు అధికమైనవి.)

బాన : అయామ్ వెరీసారీ చాలా విచారించుచున్నాను. ఈ కట్టాబొమ్మన్‌ను పట్టుకొనుటలో మాకు ఎంతో సహాయంచేసివున్న పుదుకోట రాజాగారు సిక్‌గా అనారోగ్యముగా వున్నందున ఈ విచారణకు రాలేక పోయినారు. వారికి మా కృతజ్ఞతలు ప్రత్యేకముగా తెలుపుకొంటూ యున్నాము. అలాగే మాకు అండదండగా నిలచి కార్యమును సాధించిన శ్రీ ఎట్టప్పగారికి కూడా మాకంపెనీ కృతజ్ఞతలు చెబుతోవుంది.

[బయట కలకల మెక్కువయింది. జనం "కట్టబొమ్మ కరుత్తయ్య నాయకునికి జై" "పాంచాల

కూర్చి ప్రభువుకూ జై" అంటూ నినాదాలు జేస్తు న్నారు.]

బాన : (కోపంగా) ఎవరక్కడ ? వాళ్ళనోళ్ళు మూయండి.

[కాస్సేపటికి కోలాహలం తగ్గింది; బంధించబడి వున్న కట్టబ్రహ్మనను సిపాయిలు తీసుక వస్తు న్నారు. చాలా హుందాగా, మదగజంలా నడుస్తు న్నాడు కట్టబ్రహ్మన. అతన్ని చూడగానే పాలె గాండ్లంతా తలలు వంచారు. కట్టబ్రహ్మన వారివంక అసహ్యంగా చూచి చిరునవ్వు నవ్వాడు.]

కట్ట : ఓ ! చాలామంది సోదరులు దయచేశారే ! రామలింగ మొదలియార్, శివగిరి ప్రభువు, కొడివెట్టూరు నాయ కులు, సరే ఎట్టప్పనాయకులు. ఇందరు మిత్రులు విచ్చే శారుగాని, ఎక్కడ మా ప్రాణ స్నేహితులు, మహోప కారి యయిన పుదుక్కోట ప్రభువు శ్రీ శ్రీ శ్రీ విజయరఘునాధులు వారగుపించరే ! అతి ముఖ్యులు వారే లేకుండా పోవటమా ? మిత్రునికి తను చేసిన ఉపకార ఫలితాన్ని కళ్లారాగాంచి ఆనందించే అవ కాశాన్ని వారెందుకు జార విడుచుకున్నారు ?

[కట్టబ్రహ్మన పేరు పేరునా సంబోధిస్తూ సిశితంగా చూస్తుంటే ఆ చూపుల వాడికి తట్టుకోలేక తలలు వాల్చారంతా]

న : (బల్లమీాదగుద్ది) సైలెన్స్! సైలెన్స్! నిశ్శబ్దము. ఖైదీ న్యాయస్థానములో అనవసర సంభాషణము చేయరాదు.

కట్ట : (పళ్ళు నూరుతూ) ఖైదీ– న్యాయస్థానము– న్యాయ మూర్తులు!

బాన : విచారణ ప్రారంభము కాబోవుచున్నది. నిశ్శబ్దముగా నుండవలసినదిగా హెచ్చరిక. (నేరారోపణపత్రాన్ని తీశాడు)

కట్ట : (బుసలుకొడుతూ నిలబడివున్నాడు.)

బాన : దోషి వీరపాండ్య కట్టాబొమ్మన్ కరుత్తయ్యనాయ కుని మీాద ఈస్టిండియా కంపెనీవారు ఆరోపించు నేరములు. ఒకటవ నేరము: కంపెనీ వారికి కట్టవలసిన కప్పమును చెల్లించక కంపెనీ అధికారమును ధిక్క రించుట! దీనికి ముద్దాయి సంజాయిషీ ?

కట్ట : మీా ఈస్టిండియా కంపెనీ వారికి నేనెందుకు కప్పం చెల్లించాలి? నేను స్వతంత్రుడను. ఎవరికీ కప్పం చెల్లించవలసిన అవుసరం నాకులేదు. నేనేకాదు, మా తాతముత్తాలు కూడా ఎవరికీ కప్పం చెల్లించివుండ లేదు. ఎక్కడినుండో బ్రతుకుతెరువుకోసం ఈ దేశం వచ్చి; వ్యాపారం పేరుతో తిష్ఠవేసి, కుట్రలు కుయుక్తులు పన్ని, ఈ దేశ ప్రజలలో ఐకమత్యం చెడగొట్టి రాజ్యాలమధ్య కలహాలురేపి, ఇక్కడ

పెత్తనం చెలాయించ చూస్తున్న మీకా నేను కప్పం చెల్లించటం ? మీ అధికారానికా ఈ కట్టబ్రహ్మన తలవంచటం ? అది నా బొందిలో ప్రాణముండగా జరుగదు. నేనేకాదు. ఆత్మాభిమానంవున్న వాడె వ్వడూ మీకు కప్పం చెల్లించడు. భూమాత దయవల్ల, రైతుకూలీల శ్రమశక్తి ఫలితంగా పంటలు పండుతుంటే మీకెందుకు కప్పం కట్టటం ?

జాన : తక్కిన పాళెగాండ్లందరూ చెల్లించటం లేదా ?

కట్ట : వారిలా ఆత్మగౌరవాన్ని మంటగలపుకుని, స్వార్థం కోసం మాతృభూమిని సైతం తాకట్టుబెట్టి, మీ అధికారానికి తలవొగ్గటానికీ కట్టబ్రహ్మన మృతదేహం కూడా అంగీకరించదు.

జాన : రెండు: మీ మంత్రి దానాపతి కంపెనీ ఆస్థులను దోపిడీ చేయించి కంపెనీ వారికినష్టాన్ని కలిగించినాడు. అతన్ని మాకు అప్పగించకపోవటానికి కారణం ?

కట్ట : మీ నష్టానికి రెండింతలు చెల్లిచాము. మా కుడిభుజం లాంటి మంత్రినర్యుని, మాకత్యంత ప్రీతిపాత్రుడైన దానాపతిని మీ కెందుకప్పగించటం! ఆయననుశిక్షించే అధికారం మాది మీరెవరు ? ఆయన వంక కన్నెత్తి చూచే అధికారంకూడా మీకు లేదు.

జాన : సరే, శివగిరిలో అంతఃకలహాలకు కారణం నీవుకాదా!

: కాదు. అక్కడ సోదరులమధ్య స్పర్థలు రూపుమాప టానికే నేనక్కడికి వెళ్ళాను. వారిలో వారికి కలహాలు పెంచటానికి కాదు. అది మా పద్ధతికాదు.

జాన : కంపెనీ అధికారమును ధిక్కరించవలసిందిగా పాలె గాండ్లను ప్రోత్సహించలేదా ?

కట్ట : నేను పసిగట్టుకుని ఎవరికీ చెప్పలేదు. కాని, పరపాల నకు తలవొగ్గవద్దని ప్రతి భారతీయుని హెచ్చరిస్తున్నా నిప్పటికీ.

జాన : నీ పైన ఇంకా చాలా నేరములున్నవి. వాటిని వివ రించి రుజువు చేయుటకు ఇక్కడ చాలామంది వున్నారు.

కట్ట : మీ మోచేతి క్రింది నీళ్ళు త్రాగే పెద్దలు, స్తన్య మిచ్చిన తల్లి రొమ్ముగుద్దే నీచులు దేనికయినా సిద్ధ మవుతారు.

జాన : సరే, ఆరుంగుళము, సుబ్బలాపురము గ్రామములను ఎట్టప్ప నాయకునకెందుకు స్వాధీనం చేయలేదు ?

కట్ట : మీరెవరు ఆ మాట నడగటానికి ? అసలెందుకివ్వాలి అతనికా గ్రామాలు ?

జాన కంపెనీ వారాయనకు బహూకరించారు.

కట్ట : నా సొమ్ము దానం చేయటానికి మీకేమధికారం వుంది ? ఎట్టప్ప నన్ను యాచిస్తే నేనే యిచ్చివుండే వాడినిగదా ?

బాన : (గుడ్లెర్రజేసి) కంపెనీ పైన యుద్ధంచేసి అపారమైన నష్టాలు కలిగించావు వేలకొలది సైనికుల్ని చంపి వేశావు.

కట్ట : యుద్ధంలో ఎదురయిన వ్యక్తిని చంపక ముద్దుపెట్టు కుంటారా మీరు ? (నవ్వులు)

బాన : (కోపంతో బల్లగుద్ది) సైలెన్స్, సైలెన్స్ సరే, ఈ నేరములన్నీ యదార్థములనీ, నీవు దోషివనీ కంపెనీ వారి ఈ న్యాయస్థానము విశ్వసిస్తూన్నది. నీవు చెప్ప దలచినదివుంటె త్వరగా చెప్పుకోవచ్చు.

కట్ట : ఏం చెప్పమంటావ్ బానర్ మేన్? నా కాళ్ళు చేతులు బంధించి నిరాయుధుణ్ణిచేసి నిలబెట్ట కలిగావుకాని, నాలో ఉరకలు వేస్తున్న స్వతంత్ర పిపాసను అరికట్ట గలవా ? మీకు జడిసి మీ అధికారానికి తలవొగ్గటం పాంచాలకురిచ్చి పసిపాపకుకూడా చాతకానిపని. మీరు ఎక్కడనుంచో ఇక్కడకు వచ్చారు. వ్యాపారం పేరుతో యిక్కడ ప్రవేశించి, ఇక్కడ అంతః కలహాలు సృష్టించి, ఇక్కడి వారి బలహీనతను ఆధారం చేసుకుని ఈ దేశం మొత్తం మీ హస్తగతం చేసు కోవటానికి ప్రయత్నిస్తున్నారు. తాత్కాలికంగా విజయం సాధించినా, ఇక్కడ మీ ఉనికి స్థిరం చేసు కోవటం, ఈ దేశాన్ని, ఈ ప్రజలను శాశ్వతంగా మీ బానిసల్ని చేసుకోవటం జరగదని తెలుసుకో.

ఒకనాటి కీ జాతి జాగరిత మవుతుంది. ఈ ప్రజలు చైతన్యవంతులయి మీకు తగిన పాఠం నేర్పుతారు. మీ మోసాలు, కుట్రలు, దార్జన్యాలు అంతం చేస్తారు మిమ్మల్ని మూటాముల్లె కట్టించి మీ సీమకు పంపిస్తారు.

బాన : (బల్ల గుద్ది) అనవసర ప్రసంగము. హద్దుమీరి మాట్లాడు చున్నావు.

కట్ట : నువ్వెవరవు నాకు హద్దులు పెట్టటానికి ? హద్దుమీరి ప్రవర్తిస్తున్నది నీవు. లేని అధికారం చెలాయించా లని చూస్తున్నది నీవు.

బాన : చూశారా కట్టాబొమ్మన్ పొగరు ? (సభికుల నడిగాడు)

కట్ట : వాళ్ళేం చూస్తారు ? చూడలేకనే తలలు వంచు కొంటున్నారు.

బాన : ఇక నిన్ను దయ తలచటం మాకు ఇష్టంలేదు.

కట్ట : నీ దయా ధర్మాలు నేను కోరటంలేదు.

బాన : నీకు తగిన శిక్షను విధించక తప్పదు. (సభ వేపుచూచి) విన్నారుగా మీ రంతా — కట్టాబొమ్మన్ చేసిన నేరములు ? ఈతడు దోషి అని అంగీకరిస్తున్నారా మీరు ?

[ఎవ్వరూ మాట్లాడరు. బయట జనం గోల]

జనం : కట్టబ్రహ్మన ద్రోహికాదు. ఆయన మహావీరుడు. మా నాయకుడు మా ప్రభువు. ఆయన్ను విడుదల చెయ్యాలి.

బాన : (బల్లగుద్ది) సైలెన్స్ సైలెన్స్. వాళ్ళ నోళ్ళు మూయించండి ముందు.

కట్ట : అవును వాళ్ళనోళ్ళు మూయించగలవు. కాని వాళ్ళ నిజాన్ని ఘోషిస్తూనే వుంటయ్. వాటిని మూయటం మీ పశుబలానికే కాదు; ప్రపంచంలో ఏ శక్తికీ సాధ్యంకాదు.

బాన : (కోపంగా) నీతో అనవసరంగా వాదించి కాలంవ్యర్థం చేయలేము. ఇక మా తీర్పును వినిపిస్తాము అంతకు ముందు ఇక్కడ కూర్చునివున్న పెద్దల అభిప్రాయము మేము విన కోరుచున్నాము.

ఎట్ట : (లేచినిలబడి) కట్టబ్రహ్మకరుత్తయ్య నాయుకుడు ద్రోహిగా మేమందరమూ అంగీకరిస్తున్నాము.

కట్ట : (ఎట్టప్పవంక అసహ్యంగా చూశాడు.)

ఎట్ట : (తలవంచుకుని కూర్చున్నాడు.)

కట్ట : నేనా ద్రోహిని ఎట్టప్పా? జన్మ భూమిని పరులకు తాకట్టు పెట్టుతున్న నీచులు మీరా ద్రోహులు — మాతృభూమి స్వాతంత్రరక్షణకు నడుం కట్టిన నేనా ద్రోహిని యెట్టప్పా? ఆత్మల నమ్మ్మకుని,

పరాన్నభుక్కులై, వేలకొలది మైళ్ళ దూరంనుండి వచ్చిన తెల్లదొరల మెప్పుకోసం వారి నాశ్రయించి దేశానికి, దేశప్రజలకు తలవంపులు తెస్తున్న మీరా దోషులు - ఆత్మగౌరవంతో స్వతంత్ర జీవనంకోసం తహతహలాడే నేనా దోషిని చెప్పు? మీలో చీమూ నెత్తురు హరించి పోయినవి. మీలో మగటిమ నశించింది. ఈర్ష్య, ద్వేషం, మీలో గూడు కట్టినవి. స్వార్థం మీమీద ముసుగు కప్పింది వంచన, మిత్రద్రోహం, దేశద్రోహం ఈ నేరాలకు ఈనాడు కాకున్నా రేపయినా మీరు సంజాయిషీ యిచ్చుకోక తప్పదు. ప్రజాశక్తి మిమ్మల్ని నిలబెట్టి ప్రశ్నిస్తూంది. మీ నేరాలకు తగిన శిక్ష విధిస్తుంది. చరిత్రలో మీరు, మీ నీచత్వం చిరస్థాయిగా నిలుస్తుంది. భావి భారత ప్రజ మిమ్మల్ని, నాలాంటి వాళ్ళనూ మరువదు. చరిత్ర మాకుజోహార్లు పలుకుతుంది. నీరాజనాలిస్తుంది. మిమ్మల్ని దుమ్మెత్తి పోస్తుంది. మీ అన్యాయాలు అక్రమాలు చరిత్రలో శాశ్వతంగా మీ ప్రక్కనే నిలుస్తయ్. (దగ్గరగా వెళ్ళాడు.)

ఎట్ట : (తల ప్రక్కకు తిప్పుకున్నాడు.)

కట్ట : ఎందుకు నా దృష్టినుండి తప్పుకోవటానికి ప్రయత్నిస్తావు? ఈ నా చేతులకు వేసిన బంధం తెల్లవారు

వేసినది కాదు. సాటి సోదరుడవైన నీవు తగిలించావు. కాని, ఎట్టప్పా ఇది నా చేతులకు సంకెళ్ళు వేయటం కాదు యెట్టప్పా! పవిత్ర భారతమాత హస్తాలకు వేసిన బంధమిది. నీ చేతులతో నీదేశాన్ని బంధించి పర దేశస్థుల కప్పగించావు. నీ వంటి, రఘునాథతొండైమాన్ లాంటి దేశద్రోహులవల్లనే జాతి, దేశం అన్యుల హస్తగత మవుతున్నది. దీనికి సరైన శిక్ష త్వరలోనే మీకు లభిస్తుంది.

: (బల్ల గుద్ది గట్టిగా) అనవసర ప్రసంగం ఆపాలి. తీర్పు యివ్వబోవుచున్నాము. ఈ ముద్దాయి కట్టాబొమ్మన్ కరుత్తయ్యా నాయకునిపైన నేరములన్నియు రుజువైనవి. ఈతడు నేరస్థుడుగా నమ్ముతూ, ఈ న్యాయస్థానము ఈతడికి శిక్ష విధించుతోంది. ఈతని నేరములకు సరైన శిక్ష మరణదండనయే! ఇదే మా తీర్పు.

[బయట జనంలో గందరగోళం. "అన్యాయం" "అక్రమం" "ఈతీర్పు దారుణం" "ఇదంతామోసం" అని అరుపులు. పాలెగాళ్ళుకొందరు లేచి వెళ్ళారు.]

బౌన : మా తీర్పు ఒక గంటలోగా అమలు జరుగుతుంది. ముద్దాయి ఇంకేమైనా ఆఖరిమాటలుంటే చెప్పుకోన వచ్చు.

కట్ట : మాటలు నేను చెప్పటానికేమీ మిగల్లేదు బౌనర్ మేన్. కాని ఒక్కటి మాత్రం నీకు స్పష్టం చెయ్యదల చాను. నీవు మోసంతో, పశుబలంతో నన్ను బంధించి అక్రమ మయిన విచారణ తంతు జరిపి, నా మెడ కురిత్రాడు తగిలించుతున్నావు. నన్నయితే చంప గలవుకాని, నాలోని స్వాతంత్ర్య పిపాసనెలా చంపగలవు! నేను మరణిస్తున్నందుకు నాకు విచారంలేదు. కాని నా విచారమల్లా ఒక్కటే. నా వీరులతోపాటు కదన రంగంలో వీరస్వర్గం అలంకరించే సదవకాశాన్ని జార విడుచుకుని ఇలా మరణిస్తున్నాననే బాధమాత్రమే! బౌనర్ మేన్ నా కడసారిమాట ! ఇక్కడ నాలాంటి వాళ్ళనెందర్ని చంపినా ఈ దేశ ప్రజల స్వాతంత్ర పిపాసను అణచలేవు. ఒక కట్టబ్రహ్మనపోతే వేలు, లక్షలు ఉద్భవిస్తారు మీ అధికారాన్ని నాశనం చేస్తారు. ఇక్కడ చిందిన ప్రతి నెత్తురుబొట్టునుండి

ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లి మిమ్మల్ని దహించివేస్తయ్.
ఇదే నీకు చెప్పదలిచాను.

[దూరాన్నుండి సన్నగా]

"ఒక వీరుడు మరణిస్తే
వేలకొలది ప్రభవింతురు
ఒక నెత్తుటి బొట్టులోన
ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు....ఖబడ్దార్"

(సోమసుందర్)

జ్ఞాన : సరే, నీ ఆఖరికోరిక వుంటే చెప్పుకోనవచ్చును.

కట్ట : ఏమీలేదు కాని అవకాశముంటే, నా సోదరులను, నా కష్టసుఖాలలో భాగం పంచుకుని నీడల్లా నన్ను వెన్నంటి వున్న నా సోదరుల నొక్కసారి చూచి, వారితో రెండు క్షణాలు మాట్లాడాలని వుంది.

జ్ఞాన : దేశ భద్రతకు ప్రమాదము కలుగగలదన్న సంకోచముతో నీ కోరిక తిరస్కరించ బడుతోంది.

కట్ట : (చిరునవ్వు నవ్వాడు) సరే.

జ్ఞాన : ఇక ఈతనిని తీసుక వెళ్ళండి.

[లేచాడు. అందరూ లేచి నిలబడ్డారు. సిపాయిలు కట్టబ్రహ్మనను తీసుకెళుతున్నారు.]